భారతదేశం ఒక విభిన్న మత విశ్వాసాలు, భాషలు, సంస్కృతులు, ఆచారాలు మరియు సాంప్రదాయాలు కలిగిన పుణ్యభూమిగా విరాజిల్లుతోంది. లక్షలమంది భక్తులు ప్రపంచవ్యాప్తంగా ఇక్కడికి వచ్చి, ఇక్కడున్న దేవాలయాలను సందర్శిస్తుంటారు. కొంతమంది తమ కోరికలను భగవంతునితో చెప్పుకునేందుకు వస్తే, మరికొంతమంది ఆ కోరికలు తీరిన ఆనందంలో వస్తారు.

భారత దేశంలో ఆధ్యాత్మిక విలువ మరియు నిర్మాణ శిల్పకళకు చెందిన టాప్ 20 ఆలయాలను ఇక్కడ తెలుసుకుందాం.

# వైష్ణో దేవీ మందిరం, జమ్మూ కాశ్మీర్

వైష్ణో దేవీ మాత ఆలయం జమ్మూ కాశ్మీర్‌లోని రేసి జిల్లా కత్రా పట్టణంలో కలదు. దేశంలో హిందువులకు ముఖ్యమైన తీర్థయాత్రల్లో ఈ ఆలయం కూడా ఒకటి. దేశంలోని 51 శక్తి పీఠాల్లో వైష్ణో దేవీ ఆలయం కూడా ఒకటి. భారత్‌లోని దేవాలయాల్లో ఈ ఆలయం చాలా ప్రాముఖ్యం పొందింది.



# తిరుమల వెంకటేశ్వర స్వామి, తిరుపతి

తిరుపతిలో ఉన్న తిరుమల వెంకటేశ్వర స్వామి దేవాలయం దేశంలోనే ఒక ధనిక పుణ్యక్షేత్రంగా పేరుగాంచింది. తిరుమల కొండపై ఉన్న ఏడు కొండలపై నెలకొన్న ఈ ఆలయంలో వెంకటేశ్వరస్వామి కలియుగ దైవంగా భక్తులకు దర్శనమిస్తున్నాడు. ఈ దేవాలయానికి రోజుకు 50,000 నుండి 1,00,000 మంది భక్తులు విచ్చేస్తుంటారు. దేశంలో ఎక్కువగా భక్తులు విచ్చేసే ఆలయంగా తిరుమల పేరు సంపాదించింది.





# స్వర్ణ దేవాలయం, అమృత్ సర్

స్వర్ణ దేవాలయంగా పిలువబడే సిక్కుల గురుద్వార్ హర్మందిర్ సాహిబ్ లేక దర్బార్ సాహిబ్ అమృత్ సర్ నగరంలో ఉంది. ఈ గురుద్వార్ గోడలు, గోపురం పూర్తిగా బంగారం పూత పూయడంతో దీనికి స్వర్ణ దేవాలయం అని పేరొచ్చింది. ఈ ఆలయాన్ని గురు అర్జన్ నిర్మించారు. దీనికి నాలుగు దిక్కుల్లో నాలుగు ద్వారాలు ఉండి కుల, మత భేదాలు లేకుండా అందరికీ ఆహ్వానం పలుకుతుంది.

# అయ్యప్ప స్వామి మందిరం, శబరిమల

పశ్చిమ కనుమల శ్రేణులలోని కేరళలో నెలకొన్న పుణ్యక్షేత్రం శబరిమల. చుట్టూ 18 కొండలు, దట్టమైన అడవుల మధ్య ఈ ఆలయం ఉంది. మహిషి అనే రాక్షసుడిని వధించిన తరువాత అయ్యప్ప ఇక్కడ ధ్యానం చేసినట్లు భక్తులు నమ్ముతారు. అందుకే ఈ ప్రదేశాన్ని వారు చాలా పవిత్రంగా చూస్తారు. శబరిమలకు సంబంధించిన మరొక ఆసక్తికరమైన విషయం ఏమిటంటే ఇక్కడి ఆలయంలోకి కేవలం పురుషులను మాత్రమే అనుమతిస్తారు.



భారతదేశంలోని హిందువులకు పవిత్రమైన నాలుగు ప్రదేశాలు లేదా నాలుగు ధామాలులో రామేశ్వరం కూడా ఒకటి. పంబన్ దీవిలో ఉన్న రామేశ్వరంను పంబన్ కెనాల్ తమిళనాడుతో కలుపుతుంది. ఈ ఆలయంలో రెండు లింగాలు దర్శనమిస్తాయి. చిన్న లింగాన్ని సీత నిర్మించిందని దీనిని రామలింగం అని అంటారు. పెద్ద లింగాన్ని హనుమంతుడు నిర్మించడంతో దానిని విశ్వలింగం అంటారు.

# రామనాథస్వామి ఆలయం, రామేశ్వరం



కోణార్క్‌లోని సూర్య దేవాలయం ఒక అద్భుత నిర్మాణ శైలికి అద్దం పడుతుంది. సూర్య దేవుడుకి నెలవుగా ఉన్న కొన్ని దేవాలయాల్లో కోణార్క్ దేవాలయం చాలా ప్రాముఖ్యత కలిగింది. చంద్రభాగా నది తీరంపై కట్టిన కోణార్క్ దేవాలయం ఎలాంటి స్థానంలో నిర్మించబడినది అంటే తొలి సూర్య కిరణాలు దీని ప్రధాన ద్వారాన్ని తాకేలా ఈ అలయాన్ని నిర్మించారు.

# సూర్య దేవాలయం, కోణార్క్





# పూరీ జగన్నాథ్ మందిరం, పూరీ

ఒడిషాలోని పూరీ జిల్లాలో జగన్నాథ్ మందిరం నెలకొని ఉంది. నాలుగు ధామాలలో ఒకటిగా ప్రాముఖ్యం పొందింది. జీవితంలో ఒక్కసారైనా ఇక్కడికి రావాలనేది ప్రతి హిందువు కోరిక అని అంటారు. ఈ ఆలయంలోకి ప్రవేశించేందుకు చాలా కట్టుబాట్లు ఉన్నాయి. హిందువులు కాని వారు ఇక్కడికి రావడం పూర్తిగా నిషేధం. ఇతర దేశాల నుండి వచ్చే హిందువులు వారు భారతీయులుగా కనిపించకపోతే కూడా ఇక్కడ ప్రవేశించేందుకు నిరాకరిస్తారు.



# శ్రీ పద్మనాభస్వామి ఆలయం, తిరువనంతపురం

కేరళ రాష్ట్ర రాజధాని తిరువనంతపురంలో శ్రీ పద్మనాభస్వామి ఆలయం ఉంది. ఈ ఆలయం ప్రవేశ నియమాల ప్రకారం కేవలం హిందువులను మాత్రమే ఇందులోకి అనుమతిస్తారు. అది కూడా సరైన పద్ధతిలో వస్త్రధారణ చేస్తేనే లోనికి అనుమతిస్తారు. ఇందులో లభించిన గుప్తనిధి ప్రపంచవ్యాప్త దృష్టిని తనవైపు తిప్పుకుంది. చరిత్రలో ఎప్పుడు లేని విధంగా ఇందులో బంగారం, వజ్రాలు దొరకడంతో ఇది ప్రపంచంలోనే ధనిక దేవాలయంగా మారిపోయింది.

పుణ్యస్థలం అయిన వారణాసిలో నెలకొన్న కాశి విశ్వనాధుడి ఆలయంను ప్రతి హిందువులు జీవితంలో ఒక్కసారైనా దర్శించుకోవాలని కోరుకుంటారు. తమ పితృమూర్తుల చితాభస్మాన్ని ఇక్కడ ప్రవహించే గంగా నదిలో కలపాలని వారు కోరుకుంటారు. గంగాలో పుణ్యస్నానం చేసి కాశివిశ్వనాధుడిని దర్శించుకుంటే మోక్షం లభిస్తుందని చాలా మంది భక్తులు నమ్ముతారు.

# కాశి విశ్వనాధ్, వారణాసి





# కేదార్‌నాథ్ మందిరం, కేదార్‌నాథ్

గర్వాల్ హిమాలయ శ్రేణులపై ఉత్తరాఖండ్ రాష్ట్రంలోని కేదార్‌నాథ్‌లోని మందాకిని నది ఒడ్డున ఈ ఆలయం నెలకొంది. ఇక్కడి ప్రతికూల వాతావరణం కారణంగా ఈ ఆలయం కేవలం ఏప్రిల్ నెలాఖరు(అక్షయ తృతీయ) నుండి నవంబర్(కార్తీక పౌర్ణమి) వరకు మాత్రమే తెరిచి ఉంటుంది.



# బద్రినాథ్ మందిరం, బద్రినాథ్

ఉత్తరాఖండ్ రాష్ట్రంలో ఉన్న బద్రినాథ్ మందిరం మహావిష్ణువు భక్తులకు పుణ్యక్షేత్రంగా వెలిసింది. ఇక్కడి గుడితో పాటు నగరం కూడా కలిసి నాలుగు ధామాలలో ఒకటిగా మారింది. ఈ ఆలయం సంవత్సరంలో ఆరు నెలలు(ఏప్రిల్ నుండి నవంబర్ మధ్యలో)మాత్రమే తెరిచి ఉంటుంది.

# సిద్ధి వినాయక మందిరం, ముంబై

శ్రీ సిద్ధివినాయక గణపతి మందిరం ముంబైలోని ధనిక ఆలయాలలో ఒకటి. లక్ష్మణ్ విఠు మరియు దూబాయ్ పాటిల్ ఈ ఆలయాన్ని నిర్మించారు. కాగా గణేష్ చతుర్థి పండుగను ఇక్కడ అంగరంగ వైభవంగా జరుపుతారు. ఈ ఆలయాన్ని చాలా సుందరంగా అలంకరించడంతో చాలా మంది పర్యాటకులు ఇక్కడికి విచ్చేస్తారు. లక్షల మంది భక్తులు ఈ గుడిని ఒక్కసారైనా తప్పకుండా చూడాలని కోరుకుంటారు.



# ద్వారకాదీష్ మందిరం,
## ద్వారకా

గుజరాత్‌లోని ద్వారకాలో నెలకొన్న ద్వారకాదీష్ మందిరం శ్రీకృష్ణుడి రాజధాని ద్వారకా నగరం పేరుపై ఏర్పడింది. మహాభారత యుద్ధం తరువాత నగరంగా ద్వారకా మారింది. ఈ ఆలయంలో శ్రీకృష్ణుడిని పూజిస్తారు. కాగా ఇది 72 పిల్లార్‌లతో కూడిన ఐదు అంతస్తుల భవనం.

భారత్‌లోని న్యూఢిల్లీ రాష్ట్రంలో ఉన్న అక్షరధామ్ మందిరం ఒక చాలా అందమైన దేవాలయంగా గుర్తింపు పొందింది. ప్రపంచపు అతిపెద్ద సమగ్ర హిందూ దేవాలయంగా ఈ ఆలయం గిన్నీస్ రికార్డును సొంతం చేసుకుంది. వాస్తు శాస్త్రం, పంచరత్ర శాస్త్రం కలిపి నిర్మితమైన ఈ ఆలయం న్యూఢిల్లీ వచ్చే 70 శాతం పర్యాటకులను తనవైపు ఆకర్షిస్తుంది.

# అక్షరధామ్ మందిరం, న్యూ ఢిల్లీ





# మీనాక్షి అమ్మవారి మందిరం, మధురై

మధురై నగర నడిబొడ్డున వైగై నదీతీరంలో ఉన్న మీనాక్షి అమ్మవారి మందిరం దక్షిణ భారతదేశంలోని ఆలయాలలో చాలా ప్రాముఖ్యత పొందింది. ఈ ఆలయం ఆధ్యాత్మిక విలువలతో పాటు దీని అద్భుతమైన నిర్మాణశైలితో పర్యాటకులను ఆకర్షిస్తుంది. చుట్టూ 14 గోపురాలతో ఉన్న ఈ ఆలయంలో రెండు బంగారపు విమానాలను గర్భగుడిపై నిర్మించారు. మీనాక్షి అమ్మవారి మందిరంలో దాదాపు 33,000 శిల్పాలు ఉన్నాయి.

# సాయి బాబా మందిరం, షిర్డి

షిర్డిలో నెలకొని ఉన్న ఆలయం సాయి బాబా మందిరంగా ప్రపంచ ప్రఖ్యాతి చెందింది. సాయి బాబా అంటే ఒక సన్యాసి అని ఇక్కడి స్థలపురాణం చెబుతోంది. అందుకే భారతదేశంలోని హిందూ-ముస్లింలు కలిసి పూజలు చేసే చాలా తక్కువ ఆలయాల్లో షిర్డి ప్రసిద్ధి చెందింది. అన్ని మతాలు ఒకటే అనే భావాన్ని సాయి బాబా నమ్మేవారు.





# గోమటేశ్వర బాహుబలి, శ్రావణబెళగొళ

కర్ణాటకలోని హసన్ జిల్లాలోని శ్రావణబెళగొళ 57 అడుగుల ఎత్తైన గోమటేశ్వర బాహుబలి విగ్రహానికి ప్రసిద్ధి. భారత్‌లోని జైనులకు ఇది ఒక చాలా ముఖ్యమైన తీర్థయాత్రగా ప్రసిద్ధిగాంచింది. ప్రపంచంలో అతిపెద్ద ఏకశిల విగ్రహంగా ఇది గుర్తింపు పొందింది. ఈ విగ్రహానికి జరిగే మహామస్తకాభిషేక వేడుక కోసం కొన్ని లక్షల మంది భక్తులు శ్రావణబెళగొళకు చేరుకుంటారు.



# ఖజురహో మందిరం, మధ్యప్రదేశ్

ఖజురహోలో నెలకొన్న దేవాలయాలు వాటి అందమైన శిల్పాలు మరియు చెక్కడాలతో పర్యాటకులను కట్టిపడేస్తాయి. మధ్యప్రదేశ్‌లో ఉన్న ఖజురహో దేవాలయాలను యునెస్కో ప్రపంచ వారసత్వ ప్రదేశంగా గుర్తించింది. ఈ ప్రదేశంలో అత్యధిక సంఖ్యలో జైన మరియు హిందూ దేవాలయాలు ఉన్నాయి.

భారత్‌లోని 12 జ్యోతిర్లింగ ఆలయాలలో ఒకటిగా సోమనాధ్ మందిరం ప్రాముఖ్యత సంపాదించింది. గుజరాత్ పశ్చిమ తీరంలో నెలకొన్న ఈ ఆలయం చాళుక్యుల శైలిలో నిర్మించడం జరిగింది. దీని ముఖ్య శిఖరం 150 అడుగుల ఎత్తులో ఉండి భక్తులను ఆశ్చర్యానికి గురిచేస్తుంది.

# సోమనాధ్ మందిరం,

## గుజరాత్



శ్రీకృష్ణ జన్మభూమి మందిరం లేదా కృష్ణ జన్మభూమి, కృష్ణ జన్మస్థానం, కేశవ డియో మందిరం ఉత్తరప్రదేశ్‌లోని మథురా నగరంలో నెలకొంది. హిందువుల దైవం అయిన శ్రీకృష్ణుడు పుట్టిన స్థలంలో ఈ ఆలయం నిర్మితమైనదిగా స్థలపురాణం చెబుతోంది. క్రీ.పూ 6వ శతాబ్దం నుండి ఈ ఆలయం ప్రాముఖ్యతను పొందుతూ వస్తోంది.

# శ్రీకృష్ణ జన్మభూమి మందిరం, మథుర





# చివరగా..

కొన్ని శతాబ్దాల నుండి హిందూ దేవాలయాలు భారత సమాజానికి సమగ్ర ఉదాహరణగా నిలుస్తూ వచ్చాయి. భారత్ లోని ప్రతి ఒక్క వీధిలో చిన్న, పెద్ద తేడా లేకుండా ఒక గుడి కనిపిస్తుంది. భారతీయులు చాలా మంది హిందూ మతానికి ఇచ్చే ప్రాముఖ్యత మరియు వారు తమ మతాన్ని తప్పకుండా పాటించి తీరాలి అనే భావన వల్లే ఇన్నేళ్ళయిన ఈ ఆలయాలు చెక్కు చెదరకుండా ఉన్నాయి.

ఈ ఆలయాలలో దేనిని సందర్శించినా మీలో భక్తిభావం పెరగడమే కాకుండా భగవంతుడిపట్ల నమ్మకం కూడా కలుగుతుంది. మీరు ఇలాంటి విభిన్న సాంస్కృతిక వారసత్వం మరెక్కడ చూడలేరు.